# శ్రీ సత్యసాయి సుధ్యాక్కొబిలు

"శాంతి శ్రీ"
జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

ప్రశాంతి నిలయము
పుట్టపర్తి

ప్రథమ ముద్రణము
ప్రతులు వెయ్యి
ఉగాది 1990
రు.5

ప్రతులకు :
జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
P.B. No. 5 ప్రశాంతినిలయము
పుట్టపర్తి అనంతపురముజిల్లా

ముద్రణ :
చైతన్య ప్రింటర్స్
రామచంద్రరావురోడ్, విజయవాడ-2

# శతక శరణాగతి

ప్రొఫెసర్ జి. వి. సుబ్రహ్మణ్యం

సదమలానంద ప్రశాంతి మానస స్వచ్ఛ వీచికల
మృదుల శాంతిశ్రీ మరాళి విహరింప నిచ్చతో వచ్చె
అది పట్టి భీరువు ధైర్యమందించి అలరించుమయ్య
సదయాంతరంగ! మాస్వామి! జయ సత్యసాయీ! నమోఽస్తు!

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా పరబ్రహ్మమును దర్శించి పరమానంద పారవశ్యాన్ని అనుభవించాలని ప్రశాంతి నిలయంలో ప్రవేశించే ప్రతి జీవి అంతరంగంలో ఆలపించు కొనే ఆత్మగీతికి ఈ పద్యం ప్రతిధ్వనిగా వినిపిస్తుంది. 'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు రచించిన పద్యం ఇది అని మనం ఎవరికైనా జ్ఞాపకంచేస్తే వారనేమాట ఒకటే-

"పద్యం ఎవరిదైనా మొదట హృద్యంగా ఉంది; కవి ఈ పద్యంలో తనను గురించి చెప్పుకొన్నా అందరూ తమ తమ అనుభవాన్ని విశ్వజనీనంగా ఈ పద్యభావంలో స్మరించు కొంటూ అది తమ హృదయం పలికే భాషకు ఛందోమయ మైన అవతారంగా అనిపిస్తున్నది". ప్రశాంతి నిలయం నిజంగా ఆనంద ప్రశాంతి సరోవరం; అందులో విహరించే

పొందగలగటం సుకృతం. కవిగా చేసిన తపస్సుకు ఫలితంగా శాంతిశ్రీ భగవాన్ బాబావారి సన్నిధానంలో భాగవతగోష్ఠి సలిపే సదవకాశాన్ని పొందగలిగారు. ఒకనాటి కలంపేరు ఈనాడు గుణం పేరుగా మారింది. 'శాంతిశ్రీ మరాళం' స్వామిని 'ఆనందాన్ని' అర్థిస్తున్నది.

ఆనందాన్ని అర్థించే జీవుడు జీవసంతాపాన్ని తొలగించుకొనటానికి యత్నిస్తాడు. అది తపస్సువల్ల కొంత, దైవానుగ్రహంవలన మరింతా తొలగించుకొనటానికి వీలౌతుంది. కవికి తపస్సు కవితయే. అటువంటి తపస్సుకు ఒక ప్రమాణం శతకం. ఒక కవి శతకం వ్రాస్తున్నాడంటే - ఒక భావయజ్ఞం చేస్తున్నాడు. నవవిధభక్తుల నన్నింటినీ నవ నవ వాక్య సముదాయాలతో నారాయణునికి సమర్పించే భక్తి యజ్ఞం చేస్తున్నాడు. జీవుని వేదనగా ప్రజ్వలించే అంతర్వేదనను ఆర్తిగా, రసోక్తిగా, వ్యక్తంచేయగలిగిన సాహిత్య యజ్ఞం చేస్తున్నాడు - ఈ యజ్ఞఫలాన్ని భగవంతునికి సమర్పించి, ఆ స్వామి అనుగ్రహం పొందుతాడు. ఈ రెండంచెలనూ శాంతిశ్రీ సాధించటానికే ఈ శతకరచనం.

నీపైన శతకమ్ము వ్రాసి నిండైన నెనరుతో స్వామి!
నీ పాద నీరేజములకు నేనిత్తు నీరాజనమ్ము
నా పాపమును బాపి నాదు జీవసంతాపమ్ము దీర్చు
శాపమోక్షణదక్ష! స్వామి! జయ సత్యసాయీ! నమోఽస్తు!



కవికి శతకమే సర్వసాధనాయోగం; శతకమే పురుషార్థసారం!

శతకాన్ని మధ్యాక్కఱలో రచించే ప్రస్థానాన్ని తెలుగులో ఘంటాపథం చేసినవారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. మధ్యాక్కఱలో కవి మనసువిప్పి మాట్లాడినట్లుంటుందని విశ్వనాథవారు నిరూపించారు. మనవి చేయటానికి, మారాం చేయటానికి, కవ్వించటానికి, నవ్వించటానికి, మొరపెట్టుకొనటానికి, ముడివేయటానికి, మనసారా మమత పంచుకొనటానికి, మనసులోని రాపిడిని దించుకొనడానికి, శాస్త్ర విశేషాలు చెప్పటానికి, లోకసమాచారం విప్పటానికి, అర్థించటానికి, అధిక్షేపించటానికి, ఆర్తికి, స్ఫూర్తికి మధ్యాక్కఱను మనిషి మాధవునితో మాట్లాడే మధురమార్గంగా మలచి చూపించారు విశ్వనాథవారు. 'శాంతిశ్రీ'గారు ఈ వాఙ్మయమార్గంలో విశ్వనాథవారివలె నడిచినా, తమ ప్రత్యేకతను తాము నిలుపుకొన్నారు. విశ్వనాథవారు ఒక్కొక్క దేవునికి ఒక్కొక్క శతకం చెపితే, శాంతిశ్రీగారు సర్వదేవతాస్వరూప భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి ఒక్క శతకంలోనే నివేదించుకొన్నారు. ఒక శతకంతోనే నూరు శతకాల ఫలాన్ని సంపాదించి ధన్యులయ్యారు.

ఎంతటి మహాకవియైనా భగవంతునిముందు వాక్కును సమర్పింపదలచుకొన్నప్పుడు అహంకారాన్ని, కర్తృత్వభావాన్ని జారవిడుచుకొంటాడు. "రచియించెదువాడు రామభద్రుండట" అని నిరహంకార ప్రవృత్తిని ప్రదర్శిస్తాడు.

'శాంతిశ్రీ' మరొక అడుగు ముందుకు వేశారు. తన కవితకూ తన యెడదలోని బాధకూ అద్వైతస్థితిని భావించారు; అంతటితో ఆగక ఆ భావాన్ని కవితగా మార్చే కల్పన నొసగిన వాడు భగవంతుడేననీ, ఆ భగవానుడే సాక్షాత్ సత్యసాయీశ్వరుడనీ ప్రకటించారు.

ఇది కవిత్వంబు కాదయ్య! నా వెర్రి ఎడదలో బాధ
ఇది కావ్యమగుటయు నీ కటాక్షమ్ము ఇందీవరాక్ష!
ఇది కల్పనముచేసి నా కొసంగిన ఈశుండవీవు
సదయుండవన నీవెస్వామి! జయసత్యసాయీ! నమోఽస్తు!

ఈ భావం మధ్యాక్కఱలో మధురంగా ఒదిగింది. ఆ ఛందస్సుయొక్క శక్తి అటువంటిది. మహాభారతాదుల్లో మధ్యాక్కఱ కోపం, పశ్చాత్తాపం, దుఃఖం, ప్రబోధం, ప్రార్థనం, అధిక్షేపం, విస్మయం, నింద, స్తుతి, ఉత్సాహం, రతి-మొదలైన భావాదులను వ్యక్తంచేయటానికి వాడబడింది. విశ్వనాథవారు దానికి భక్తిని వ్యక్తంచేయగల శక్తిని ప్రసాదించారు. భక్తిలోకూడా జ్ఞానభక్తికి అందులోనూ వితర్కానికీ, వివేకానికీ, విచక్షణకూ మధ్యాక్కఱను వాహికగా వెలయించారు. శాంతిశ్రీ తమకు ముందు జరిగిన ప్రయోగాలనన్నింటినీ పరిశీలించటమే కాకుండా, శతకప్రక్రియ కనుగుణంగా మధ్యాక్కఱను వాడుకొనే ఒడుపులను చేజిక్కించుకొని ప్రయోగించారు. ప్రతి పద్యంలోనూ సంప్రదాయం



తెలిసిన ప్రౌఢిమ, ప్రయోగం చేయగలిగిన శిల్పం ప్రత్యక్షమౌతున్నాయి. శాంతిశ్రీ తెలిసి వ్రాసే శిల్పి!

ఈ శతకంలోని భావతరంగిణి త్రివేణీ సంగమం. అందులో లౌకికం, అలౌకికం, ఆధ్యాత్మికం అనే మూడు జీవనదులు సంగమించినాయి. మొదటిదానికిది ఉదాహరణం—

వ్యాధి వ్యాఘ్రమ్ముగా వచ్చి కబళింప అట్టె చూచెదవు
సాధు సంరక్షకా! రోగ మకరమ్ము చంపుమా! చక్రి!
మాధవా! బాధ భరింపజాలడు(రు) మా పసివాడు(రు)
సాధింతుననుకోకు స్వామి! జయసత్యసాయీ! నమోస్తు!

బాలుడు వ్యాధిగ్రస్తుడై బాధపడుతున్న తరుణంలో ఆ బాధనుండి బాలుణ్ణి విముక్తునిగా చేయుమని చేసే లౌకికమైన ప్రార్థనం ఈ పద్యంలోని ప్రధాన వస్తువు. రోగనివారణం కొరకు శతకాలు వ్రాసినవారూ ఉన్నారు. భాస్కరాదులవలన మయూరాదులు ఆరోగ్యాన్ని పొందిన ఉదంతాలు శతకమాహాత్మ్యాన్ని చాటుతున్నాయి. భగవంతుడు శతకకవితాప్రియుడు. ఎందువల్లనంటే - కవి లౌకికంగానూ, అలౌకికంగానూ, ఆధ్యాత్మికంగాను శతకప్రక్రియలో శరణాగతిని భజిస్తాడు. కవిత మధుర రమణీయమే కాకుండా, ఆలోచనామృతంకూడా. ఈ పద్యంలో 'శాంతిశ్రీ' కవిగా నిరూపించుకొన్న శబ్దప్రయోగం గడుసుగా కనపడుతుంది.

వ్యాధిని వ్యాఘ్రంగా పోల్చటంచేత రోగంలోని క్రూరత్వం ధ్వన్యమానమైనది. క్రూరమృగం సాధుమృగాన్ని నిష్కారణంగా బాధిస్తుంది; హింసిస్తుంది. ఈ పద్యంలో బాలుడు సాధుమృగంలాంటివాడని వాచ్యం చేయకుండా 'సాధుసంరక్షకా!' అన్న సంబోధనంచేత వ్యంగ్యం చేశారు. అలాగే 'రోగమకరం' అనేది రూపకసమాసం. ఈ అలంకారంతో గజేంద్రుడు మకరగ్రస్తుడైన వృత్తాంతం వ్యంగ్యం. 'చక్రి' అన్న సంబుద్ధి ఆ భావచిత్రాన్ని బలంగా రూపుకట్టిస్తుంది; గజేంద్రమోక్షణ కథను మన మనోనేత్రాలముందు ప్రత్యక్షీకరింపజేస్తుంది. కవితలో సార్థక శబ్దప్రయోగం రమణీయార్థ ప్రతిపాద కత్వసిద్ధిని కలిగిస్తుంది. అదే శతకంలో పరమేశ్వర హృదయప్రీతిని కలిగిస్తుంది.

గగనాన నీలమేఘమ్ములై సుంత కనుపించినంత
సొగసైన పురివిప్పి నెమ్మియై ఆడు జోరుగా ఎడద !
పగటివేల్పుగ నీవు తూర్పుమలపైకి వచ్చుచున్నంత
జగమెల్ల తమ్మియై విచ్చు జయ సత్యసాయీ! నమోస్తు !

ఇది కవియొక్క అలౌకిక భావన. మేఘానికీ నెమలికీ, సూర్యునికీ పద్మానికీ ఉన్న కవి సమయభావనచేత మధుర భక్తి భావస్పందనను ఈ పద్యంలో కల్పించారు 'శాంతిశ్రీ'. స్వామి రసప్రియుడు; రసస్వరూపుడు. 'రసోవైసః' అన్న



సూక్తికి స్వామియే సాక్షి! శతకానికి కళావైభవాన్ని సంతరించేది అలౌకిక భావలహరి.

అన్నింటికీ మించింది ఆధ్యాత్మికభావలహరి. ఇందులో భక్తిజ్ఞానవైరాగ్యధోరణులు విశిష్టంగా వ్యక్తీకరించబడ్డాయి.

భక్తికి ఒక పద్యాన్ని ఉదాహరణంగా గ్రహిద్దాం—

నవవిధభక్తి పద్ధతుల నీ కర్చనలు సేయ నాకు
అవకాశమిచ్చి పుణ్యమ్ము కట్టుకోవయ్య ! కన్నయ్య !
అవిరళమ్ముగ నాకు మధుర భక్తి రసామృతం బిమ్ము
సవితృస్వరూప ! మాస్వామి! జయసత్యసాయీ! నమోఽస్తు

జ్ఞానధోరణికి మరొక ఉదాహరణ—

ఉయ్యాల జంపాలవోలె తెగసాగుచున్నదీ బ్రతుకు
తియ్యగా ఒకసారి ఒక మహోన్నతస్థితి జేరు - అంత
చయ్యనన్ వచ్చి నేలంటుకొనును - ప్రశాంతిస్వరూప !
సయ్యాటలేల ! నాతోడ ! జయసత్యసాయీ ! నమోఽస్తు

వైరాగ్య ధోరణికి పద్యోదాహరణం—

నా మనస్సొక కోతికంటె చపలమైనది రామ ! నీదు
నామసూత్రమ్ముతో కట్టివైవ యత్నమ్ము చేసితిని
ఏమాను ? నీ కృపావీక్షణమ్మున్న నే కదా ఫలము
స్వామి ! దయాక్షీరవార్ధి ! జయసత్యసాయీ ! నమోస్తు !

ఏ భావాన్నైనా మైనంలా మలచి అలవోకగా పద్య గతిలో శిల్పించగల నేర్పరులు 'శాంతిశ్రీ'. ఆ ప్రజ్ఞను ప్రకటించే దశావతార ప్రశంస రమణీయంగా ఉంది. ఈ శతకంలో అవన్నీ ఒక యెత్తు. 'సాయిబాబా' అనే మాటలో ఉండే దివ్యమైన అర్థాన్ని - తల్లీ తండ్రీ ఒకడే అయిన భగవంతుడనే భావాన్ని - సరళంగా, మధురంగా, సరసంగా ఈ క్రింది పద్యంలో ప్రపంచించారు 'శాంతిశ్రీ'. అదొక యెత్తు.

తల్లివందురు కొందరు - మరికొందరు తండ్రి వందురు - జ
గల్లీల కాని స్త్రీ పురుష భేదమ్ము కలద నీయందు ?
తల్లివై లాలింతు వెంతో - తండ్రివై దండింతు వంతె
చల్లని మా తల్లి! తండ్రి! జయసత్యసాయీ! నమోఽస్తు!

'శాంతిశ్రీ' పిలిచిన పిలుపు సకల జీవుల గొంతుల శ్రుతిగొన్న కవివాణి! 'శాంతిశ్రీ' చేసిన జయధ్వని సకల దేశప్రజలు సంతోషంతో ఏకకంఠంతో పలికిన భక్తిగీతి! 'శాంతిశ్రీ' సాయిచరణాలకు పెట్టిన నమస్సు శతక పద్యాలన్నింటా చివర నిలిచి 'దీర్ఘశరణాగతి'ని ధ్వనింప చేస్తున్నది.

ఈ శతకం సాయి కంకితమైన శాంతిశ్రీ శరణాగతి !

—

# విన్నపము

సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వశక్తిమంతుడు అయిన శ్రీ సత్యసాయి భగవంతుని పాదపద్మాలపై ఈ మధ్యాక్కఱలను ప్రేమతో భక్తితో సమర్పిస్తున్నాను.

మధ్యాక్కఱ ప్రాచీనకాలం నుంచి వస్తున్న అందమైన ఛందం. ఇది దేశి వృత్తం. ఇందులో ప్రతి పాదంలోను ఇద్దరు ఇంద్రులు ఒక సూర్యుడు, మరిద్దరు ఇంద్రులు మరో సూర్యుడు వెరసి ఆరు గణాలుగా నిలబడతారు. మొదట యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో ఈ మధ్యాక్కఱలు కనిపించాయి. తరువాత భారతంలో నన్నయభట్టారకులు, ఎఱ్ఱాప్రెగ్గడ మధ్యాక్కఱలను రచించారు. విశ్వనాథ సత్యనారాయణగారు మధ్యాక్కఱలలో పది శతకాలను ప్రవచించారు.

మధ్యాక్కఱ మధురమైన ఛందం. భగవంతునికి హృదయపూర్వకంగా మనసులోని మాట చెప్పుకొనవలెనంటే ఒద్దికగా, నమ్రతగా, మెత్తగా ఒదిగే ఛందస్సు మధ్యాక్కఱ. అపూర్వమైన భావాలను అపురూపమైన ఈ ఛందస్సులో చెప్పాలనిపించింది. 1984లో మా అమ్మాయికి మగ శిశువు అనారోగ్యంతో పుట్టినప్పుడు ఎంతో బాధ కలిగింది. అనంతరం స్వామి దయతో క్రమ క్రమంగా ఆరోగ్యవంతుడౌతున్నాడు. ఆనాటి వేదనే ఈ శతకానికి అంకురార్పణ.

విమర్శకావతంసులు ప్రొఫెసర్ జి. వి. సుబ్రహ్మణ్యం గారు సాయి సేవాతత్పరులు. 'శతక శరణాగతి' పలికి నా హృదయాన్ని ఆవిష్కరించిన వారికి అభివందనాలు.

ఈ కృతిని శుభాకృతిగా తీర్చిదిద్దిన చైతన్య ప్రింటర్స్ మిత్రులకు శుభాకాంక్షలు.

—శాంతిశ్రీ

# శ్రీ సత్యసాయీశ్వరాష్టకం

ఈశ్వరాంబా సుతం సత్యం నిత్య మంగళ కారిణమ్
వేంకావధూత సంప్రీతం వందే సాయిం జగద్గురుమ్ !

తులసీదళ సంకాశం యోగి మానస పూజితమ్
సర్వమానవ సందేశం వందే సాయిం జగద్గురుమ్ !

హరినీల జటా జూటం పూర్ణ చంద్ర నిభాననమ్
భక్తలోక చిదాభాసం వందే సాయిం జగద్గురుమ్ !

ఆర్తత్రాణ వ్రతాధారం వ్యోమకేశ విరాజితమ్
యశశ్చంద్ర ప్రభావ్యోమం వందే సాయిం జగద్గురుమ్ !

రత్నాకర సముద్భూతం కాషాయాంబర ధారిణమ్
ఆనందకోశ సంచారం వందే సాయిం జగద్గురుమ్ !

ప్రేమామృత పయోరాశిం విశ్వకల్యాణ కారిణమ్
శాంతి సత్య సమాహారం వందే సాయిం జగద్గురుమ్ !

ప్రశాంతి నిలయావాసం బాల భాస్కర సన్నిభమ్
ఆశ్రితజన మందారం వందే సాయిం జగద్గురుమ్ !

విశ్వ విద్యాలయ వ్యాప్తం నిగమాగమ సేవితమ్
సత్యం శివంచ సౌందర్యం వందే సాయిం జగద్గురుమ్ !

సాయీశ్వరాష్టకం పుణ్యం నిత్యం మనసి యః పఠేత్
జన్మాంతర కృతం పాపం సత్యం సత్యం వినశ్యతి !

—శాంతిశ్రీ

# శ్రీ సత్యసాయి మద్యాక్ర అలు

జయ జయ ! ప్రణవస్వరూప ! సారవత్ సాహిత్యదీప !
జయ జయ ! దివ్యసందేశ ! జగదీశ ! సత్యప్రకాశ !
జయ జయ సమతావిధాయి ! జన మానసస్ఫూర్తిదాయి !
జయ భారతీ మనస్థాయి ! జయ సత్యసాయీ ! నమోస్తు !

నిజమైన ప్రేమమూర్తివని నిక్కమ్ము నీవే జగాన
భజనలు కావించినంత వాత్సల్య పూర్ణ చిత్తమున
ప్రజలను చల్లగా జూచి పాలించు బంగారు తండ్రి !
స్వజనమ్ములని ప్రోవుమయ్య జయ సత్యసాయీ ! నమోస్తు !

దివ్య మానులెరుంగజాలని అమోఘ తేజమ్ము జిమ్ము
అవ్యయానందమూర్తివని నినుజూడ అమరసంఘమ్ము
ఆవ్యోమమెల్ల నిల్వబడి వీక్షించె ననిమిషత్వమున
సవ్యసాచీ! దేవదేవ! జయ సత్యసాయీ! నమోస్తు!

నిన్ను సందర్శింపనిమ్ము కనులార! నీరేజనేత్ర!
నిన్ను ఆకర్ణింపనిమ్ము చెవులార! నిగమస్వరూప!
నిన్ను సేవింపగానిమ్ము మనసార! నీరదశ్యామ!
సన్నుతాంగ! పవిత్రపాద! జయ సత్యసాయీ! నమోస్తు!

నన్ను స్మరింపగానిమ్ము నారాయణా! నీ పదాలు
నన్ను వర్ణింపగానిమ్ము నవమోహనా! నీ గుణాలు
నన్ను పూజింపగానిమ్ము నందనందన! నిన్ను సుప్ర
సన్న స్వరూప! మా స్వామి జయ సత్యసాయీ! నమోస్తు!

జయముగూర్చెదు మాకు పార్థసారథి సరణిగా సాయి!
భయము బాపెదు కన్నతండ్రివై సాయి బంగారు తండ్రి!
దయ నిండు పాలిండ్ల హత్తుకొనెదవు తల్లివై నీవు
జయ సాయిమాత! మా తల్లి! జయ సత్యసాయీ! నమోస్తు!



గడ్డిపూవును నేను సామి! నీ పూజకై ఇంక తగన?
గ్రుడ్డి పక్కిని నేను సామి! నిను కనుంగొను దారిలేద?
దొడ్డివాకిట నుంటి సామి! నీ వారితో జేరనీవ!
జడ్డు పోద్రోలు మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఆనందమయ్యె నీ కడకురాగ బ్రహ్మానందమూర్తి!
ఆనందదుగ్ధాబ్ధి పొంగి ఆకాశమంతటన్ నిండె
జ్ఞానాకృతిన్ బొంది అందు నీమూర్తి శయనించియుండె
సానందమూర్తి! మాస్వామి జయ సత్యసాయీ! నమోస్తు!

గగనాన నీవు మేఘమ్మువై సుంత కనుపించినంత
సొగసైన పురివిప్పి నెమ్మియై ఆడు జోరుగా ఎడద!
పగటివేల్పుగ నీవు తూర్పుమలపైకి వచ్చుచున్నంత
జగమెల్ల తమ్మియై విచ్చు జయ సత్యసాయీ! నమోస్తు!

ఉయ్యాల జంపాల వోలె తెగసాగుచున్నదీ బ్రతుకు -
తియ్యగా ఒకసారి ఒక మహోన్నత స్థితిజేరు - అంత
చయ్యనన్ వచ్చి నేలంటుకొనును - ప్రశాంతి స్వరూప!
సయ్యాటలేల! నాతోడ! జయసత్యసాయీ! నమోస్తు! 10

పండువెన్నెలగాయు పూర్ణచంద్రబింబమ్ము నీవేను
మండుటెండలుగాయు గ్రీష్మ సూర్యబింబమ్ము నీవేను
అండపిండాలలో నిండి అరయు నాయకుడ వీవేను
చండప్రచండ శాసకుడ! జయ సత్యసాయీ! నమోస్తు!

పరమాణుమధ్య సూక్ష్మాతిసూక్ష్మ ప్రభాశక్తివీవ!
పరిపూర్ణ బ్రహ్మాండ నిర్భరావర్త భవ్యుండవీవ!
పరమేశ్వరీ దివ్య మోహినీ పరా వాగ్దేవివీవ!
సరిలేరు నీకు ఓస్వామి జయ సత్యసాయీ! నమోస్తు!

నవవిధ భక్తి పద్ధతుల నీ కర్చనలు సేయ నాకు
అవకాశమిచ్చి పుణ్యమ్ముకట్టుకోవయ్యా! కన్నయ్యా!
అవిరళమ్ముగ నాకు మధురభక్తి రసామృతంబిమ్ము
పవిత్ర స్వరూప! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

రామ! అప్పుడు రాజ్యమున అకాలమరణములు లేవు
భామలపై నిన్ని పాశవిక మానభంగాలు లేవు
ఏమిటిప్డు! మహానుభావ! సరిదిద్ది ఇలనేలుకోవ!
స్వామి! జగన్నాథ! తండ్రి! జయ సత్యసాయీ! నమోస్తు!



సౌందర్య సార సర్వస్వ మెవరని సర్వత్ర జూతు!
వందారు భక్తి మందారు డెవరని వనమెల్ల గాంతు!
బృందారకానంద ధాముడెవరని ఇతరమ్ము తలతు!
సందేహమునుబాపినావు! జయ సత్యసాయీ! నమోస్తు!

దీనబాంధవుడవటంచు - ఒక మహాదేవుండవంచు
జ్ఞానులున్ సేవించజూచి తొలగె అజ్ఞానమ్ము తండ్రి!
మానసాబ్జము నిండె మధువుతో - నీ సమర్చన కొఱకు -
జ్ఞానరశ్మిని పడనిమ్ము జయ సత్యసాయీ! నమోస్తు!

నీవు కారుణ్య వార్నిధివి-నిన్ను వర్ణించలేరెవరు ?
భావించినన్ జాలు ఘోర పాపాలు పరువెత్తిపోవు
దేవాధిదేవ! దయానిధీ! సర్వదీన శరణ్యా!
సావాసి వీవె మాకిచట; జయ సత్యసాయీ! నమోస్తు!

ఎవరికో ఏదో యొనర్చినావన్న ఏమిలేగాని
నవజాత శిశువుల కేల రోగాలు నాళీకగర్భ!
శివమూర్తి! నీ చేతి బొమ్మ లిట్లేల చేసినావయ్యా
నవనస్వరూప! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

మ్రొక్కగావలె ప్రజల్ పురుషోత్తముడ వీవుగనుక
గ్రక్కునన్ విచ్చేసి చల్లగా ప్రజన్ గాపాడవలయు
ఇక్కట్లుపెట్ట నీ కొరుగునేమిలే! కృపజూడుమయ్య!
చక్కదిద్దుము మమ్ము స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఏదో సమర్పింపనెంచి హృదయమదే ఊగులాడు
నా దుష్టబుద్ధి జృంభించి నైజయత్నంబెల్ల నణచు
నాదన్నదేమున్నదయ్య! నారాయణా! రమారమణ !
స్వాదుమృదురసస్వరూప! జయ సత్యసాయీ! నమోస్తు!

నవనీతహృదయ! సత్యశివ సుందరానందేందునిలయ!
భవరోగ వైద్యుండ వీవె! ముల్లోక బంధుండ వీవె!
నవజీవ చైతన్య సింధు! సకల మానసపద్మబంధు!
జవసత్వమొసగుమా ప్రజకు! జయ సత్యసాయీ! నమోస్తు!

ఈ కాళ్ళులేని బాలకుల నేమంచు ఇచ్చినావయ్య ?
ఈకున్న నిన్ను కాదన్నదెవరు ? షిరిడి కోరినార ?
నీ కృపాబలము లేకున్న నేలపై నిలువగా లేరు
సాకార కారుణ్యరూప! జయ సత్యసాయీ! నమోస్తు!



ఏనాటి పుణ్యబీజమ్మొ ఇంత ఫలించినదయ్య!
ఈనాడు నిను మనసార ఇట్లు దర్శింపగల్గితిని
ఈ నా మధుర భక్తిరసము ఎడదలో నింకిపోకుండ
జ్ఞానాంబుధర! చూడుమయ్య జయ సత్యసాయీ! నమోస్తు!

నన్ను మన్నించువారితరు లెవ్వరున్నారు దయాళు!
నన్ను నీవన్న నిన్నేను అన్న మన ప్రగాఢ బంధ
మెన్నాళ్ళకైన పోవునది కాదు సాయీ! మహాదేవ!
సన్నాథ! శ్రీనాథ! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఇంత శిక్ష విధింప న్యాయమా! స్వామి! కృపజూడుమయ్య
చింతలన్ ముంచి బాధింప మేమేమి చేసినామయ్య
వింతగానుండె నీచర్య! ఆపదల్ విడగొట్టుమయ్య
శాంతస్వభావ! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఇదియంత ఒక్క పీడకలలాగ చేయించజాలుదువు
పదములన్ బట్టి వీడనిక ఆర్తుల పాలించువరకు
హృదయార్పణముచేసి మదిని నైవేద్యమిత్తు గైకొమ్ము
సదయా! మహోదయా! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

వ్యాధి వ్యాఘ్రమ్ముగా వచ్చి కబళింప అడ్డైచూచెదవు
సాధు సంరక్షకా! రోగ మకరమ్ము చంపుమా! చక్రి!
మాధవా! బాధ భరింపజాలరు మా పసివారు
సాధింతుననుకోకు స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

నాకేది వలయునో నీ వెరుంగవా! నా పిచ్చిగాని
నాకేమిలేయంచు మిన్నకయె యుందునా! యన్న - నీకు
లోకసేవయె కాని గృహములో బాధలు చెవినబడవు
సాకల్యముగ నిన్నెరుంగ! జయ సత్యసాయీ! నమోస్తు!

కోరకూడని కోర్కెకాదె! పదవులన్ కోట్లాది ధనము
కోరుకొన్నాన? గేహాలు భోగాలు గొప్పందనాలు;
కోరుకొంటిని చిన్నవాని బ్రతుకింత గోపాలదేవ!
చారు నీరదగాత్ర! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఆకొన్న వెతగొన్న బిడ్డడార్తితో అమ్మనే పిలుచు
నీకేమి తెలుసు! నాకన్న ప్రేగు పొందెడి తీవ్ర బాధ
నాకన్న కడుపు కారోగ్య మీయవే నా ప్రాణనాథ!
సౌకుమార్యాత్మ స్వరూప! జయ సత్యసాయీ! నమోస్తు! 30



చిన్ని కష్టమ్ము వచ్చినను చీకాకుచెందు చిత్తమ్ము
ఎన్ని తీరుల ఊరడించినా ధైర్యమింతయున్ గనదు
అన్నివేళల నీవె చూచుకోవలెనయ్య - దయాళు!
సన్నుతగుణవార్ధి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఎవరికైన రవంత కష్టమైన సహింపగాలేను
వివరింపజాల నా స్థితిని ఊరకే వేసారిపోదు
కవితలల్లగలేను నిన్ను ధ్యానింపగాలేను దేవ!
సవనాత్మ! నా ఆత్మబంధు! జయ సత్యసాయీ! నమోస్తు!

నీవల్ల కానిదేలేదు నిజము మంత్రించినావేదో
నీ వర హస్తమే సౌఖ్యనిలయమ్ము - నిఖిల లోకేశ!
నీవుండ కల్పవృక్షమ్ము నిలయాన నిలచియున్నట్లై
సౌవర్ణరూప! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

తల్లివందురు కొందరు - మరికొందరు తండ్రివందురు - జ
గల్లిల కాని స్త్రీపురుష భేదమ్ముకలద నీయందు
తల్లివై లాలింతువెంతో-తండ్రివై దండింతువంతె
చల్లని మా తల్లి! తండ్రి! జయ సత్యసాయీ! నమోస్తు!

నీ సన్నిధియె సత్య సౌఖ్యమొసగు పెన్నిధి సాయిరామ!
నీ సేవ జీవచైతన్య మనునది నిత్య సత్యమ్ము
నీ సహాయ ఘృణిచే బ్రతుకుచున్నాము నీరేజనేత్ర!
చౌసితి బంధవిముక్త! జయ సత్యసాయీ! నమోస్తు!

నా స్వామి! నా ప్రాణనాథ! నవనవానంద ప్రదాత!
నీ స్వభావ మెరుంగలేక నేనేదో నిందించినాను
సుస్వాగతము! నా యెడంద సుఖముగా శోభిల్లుమో! ర
సస్వాదుహృదయ! అభ్యుదయ! జయ సత్యసాయీ! నమోస్తు!

వైద్య వేత్తలలోన చేయి తిరిగిన వైద్యుండ వీవు
విద్యా విదులలోన సకల విద్యా ప్రవీణుండ వీవు
సద్యః ఫలితమిచ్చు శ్రీ విభూతి నొసంగుదు వీవు
సద్యశః కౌముదీ ధామ! జయ సత్యసాయీ! నమోస్తు!

ఆరోగ్యమిమ్ము ఆయుష్యమిమ్ము భాగ్యమ్ములందిమ్ము
ధీరత్వమిమ్ము నీపాద రాజీవ తీర్థమ్ములిమ్ము
వైరాగ్యమిమ్ము కర్తవ్యపాలనా పటుశక్తినిమ్ము
స్వారస్య వాక్ఛక్తినిమ్ము జయ సత్యసాయీ! నమోస్తు!



అల మహా వైకుంఠపురమె పుటపర్తియై వెల్గుచుండె
తిలకింప విరజా స్రవంతి చిత్రావతిగ పారుచుండె
అల దేవతతి ఈ ప్రశాంతి వరభక్తులై కొల్చుచుండె
జలజాక్షుడవు నీవు స్వామి జయ సత్యసాయీ! నమోస్తు!

నర్తనమ్ములు చేసి నెమ్మి అందించు నవచందనములు
కీర్తనమ్ములు పాడి పికము అందించు గీః స్పందనములు
ఆర్తి తీర్చెదు స్వామి! అందుకోవయ్య అభివందనములు
స్మార్తవిద్యా రహస్యజ్ఞ! జయ సత్యసాయీ! నమోస్తు!

జ్వరములన్ పోద్రోలి హర్షమిచ్చు నీ సందర్శనమ్ము
నిరుపమాధ్యాత్మ తత్వమ్ము అందిచ్చు నీ భాషణమ్ము
చరితార్థమొనరించు మనుజజన్మను నీ స్పర్శనమ్ము
సరళస్వభావ! మా దేవ! జయ సత్యసాయీ నమోస్తు!

కోమలమ్ములు నీ పదాలు పూలరేకులకంటె - మిగుల
శ్యామలమ్ములు నీ శిరోజములు భృంగసంఘమ్ముకంటె
స్వామి! నీ హృదయమ్ము మృదువు నవనీతసారమ్ముకంటె
శ్యామసుందర దేవ! సదయ! జయ సత్యసాయీ నమోస్తు!

తీయతీయని నవ్య వరకళాసాహితీ భాజనములు
సాయం కళా త్రిసంధ్యార్చనాయోగ సంపూజనములు
శ్రేయోభిలాషి! నీ పాద రాజీవ చిర సేవనములు
సాయుజ్య వరదాయి! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

అజ్ఞాన గాఢాంధకార దూరీకృతాలోచనములు
సుజ్ఞాన చంద్రికా మంగళోదయ శుభసూచనములు
ప్రజ్ఞా ధురీణమ్ములైన స్వామి కృపా లోచనములు
స్వజ్ఞాన భాస్కరమూర్తి! జయ సత్యసాయీ! నమోస్తు!

రామ నామార్చనా తత్పరానేక వ్రత రక్షణములు
శ్రీముక్తిధామ ప్రవేశయోగ కాంక్షిత శిక్షణములు
ప్రామిన్కులందుండు శంకరా! నీ కృపావీక్షణములు
సామీరి వీవె మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

శ్రీ మహావిష్ణువై నిండు వెలుగులు చిందింతు వీవు
శ్రీ మహాదేవ నాట్యమ్ములో ప్రకాశింతువు నీవు
శ్రీ మహాయోగ సమాధి బ్రహ్మవై చెలువొందుదీవు
శ్రీ మన్మహా విరాట్మూర్తి! ప్రియ సాయి జేజే! నమోస్తు!



అమ్మా! మమున్ రక్షసేతు వీవేగదమ్మా! రయాన
రమ్మా! సుతులను బ్రోవంగ - కరుణాంతరంగ పయోధ
రమ్మా! త్రిలోకమ్ము లేలుకొమ్మా! వరాల దేవకుటు
జమ్మా! జగాలుగన్నమ్మ! జయ సత్యసాయీ! నమోస్తు!

ఉపనిషదుద్యాన వీధి నిర్మించుచుండెడు విధివి
ఉపకార మొనరింప వేగ పరువెత్తుచుండెడు హరివి
అపకారమొనరించు రాక్షసుల ద్రుంచు ఆదిరుద్రుడవు
సఫలమ్ము సేయు మాజన్మ! జయ సత్యసాయీ! నమోస్తు!

ఆప్త భక్తవరేణ్యులార! గుణసంపదభివృద్ధిరస్తు!
ప్రాప్త సదవకాశులార! నరజన్మ ఫలసిద్ధిరస్తు!
సుప్తధీనిధులార! మేలుగాంచుడు "శుభమస్తు" అనెడి
సప్తాశ్వరథి జగద్బంధు! జయ సత్యసాయీ! నమోస్తు!

శైత్య మ్మశైత్యమ్ము నీవ విగుణమ్ము సగుణమ్ము నీవ
నిత్య మ్మనిత్యమ్ము నీవ! ఖిలమునున్ నిఖిలమ్ము నీవ
కృత్య మ్మకృత్యమ్ము నీవ! అపకీర్తి కీర్తియున్ నీవ
సత్య మ్మసత్యమ్ము నీవ! జయ సత్యసాయీ! నమోస్తు! 50

ఒకకోర్కె తీరినంతటనె మరల వేరొండు కోరుటయు
ఒక అలవాటయ్యె - నీకు ఇచ్చుటయును తప్పకుండె
ఇక పడలేవు నాతోడ - జన్మరాహిత్య మ్మొనర్చు
సకల చరాచర స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఆకాశ చుంబితో ద్వేల మాధ్వీ మహాంభోధి వీవు
రాకా నిశా రాజ్య రాజిత సుధాకర స్వామి వీవు
శ్రీకరానంద సుందరతరోదంత శీకరమ్మీవు
సాకల్యమీవె! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఈవు సర్వకళావిశిష్ట ఘన శిల్పి - నేను శిల్పమ్ము
ఈవు లోకైక మహాకవీశుండ - నేను కావ్యమ్ము
నీవు త్రికాల విక్రాంత ద్రష్టవు నేను నీ దృష్టి
శైవ తాండవమూర్తి! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

పురుషుండ వీవైన నేను ప్రకృతిని పొందియవయ్య
పరమాత్మ వీవైన నేను జీవాత్మ పాలింపవయ్య
గురుడవు నీవైన నేను శిష్యుండ గుణము బోధించు
సరసీరుహాక్ష! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!



కొందరొక్కెడ జూచి చందమామనుకొందురు హృదిని
కొందరొక్కెడ జూచి భాస్కరుండనుకొందురు మదిని
ఎందరేమనుకొన్నగాని సూర్యపూర్ణేందుండ వీవు
సందేహమేలేదు స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

మంజుల మార్దవ హృదయ! మారుతి మానసనిలయ
భంజిత పాప సమూహా! స్వర్ణ సువర్ణ సుదేహా!
కుంజరనాథుని కలిసి - గొల్లలు కొలువగ తెలిసి
సంజల గొలిచితినయ్య జయ జయ సాయీ! నమోస్తు!

రామచంద్రుండీతడేను రక్షపొందుడు సత్వరంబు
శ్యామసుందరుడీతడేను సందియంబును పొందవద్దు
ప్రేమామృతంబును పంచిపెట్టగ పర్తిలో వెలసె
స్వామిపాదములంటి పలుకు - జయ సత్యసాయీ! నమోస్తు!

కోటి సూర్యులు వచ్చి శిరము వెన్కను కోరి చేరంగ
కోటి చంద్రులు వచ్చి ముఖము చుట్టును గునిసియాడంగ
కోటానుకోట్ల సంఘాల మధ్యలో కొలువయ్యె సామి
సాటిలేని మహాదయాళు! జయ సత్యసాయీ! నమోస్తు!

కడుపారగన్న దేవకిని కటకటా! కటకటాలనిడి
ఎడముగానున్న యాదవ యశోదమ్మ గృహములో జేరి
కడలేని లీలావిలాసములు జూపు కారణంబేమొ!
జడుడను నాకేమి ఎరుక! జయ సత్యసాయీ! నమోస్తు!

నీ పిల్పు లేకుండ వచ్చి ఏ పంచ నిలిచియుండుదును
నా పిల్పు నీచెవిన్ దాకనిత్తురా! నవకోటి భటులు
నా పాపమిట్లుండె నీవె ఇటు వచ్చి నన్నుద్ధరించు
శాపమోక్షణదక్ష! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు! 60

నీ నామ సంకీర్తనమ్ము భక్తితో నిత్యమ్ము సేయ
నానావిధాలైన వ్యథలు పోవునన్నావుగదయ్య
ఏ నీతి పాటింపవలెనో ఎరిగింపు ఈశ్వరీపుత్ర!
జ్ఞానప్రదాత! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

అశ్వత్థవృక్షమై నీవు జ్ఞానోదయమ్ము కల్గించు
విశ్వమ్మునకు బోధ చేసెదను శాంతివేదమ్ము - జనులు
అశ్వవేగాన నశ్వరమువైపుకే అరుగుచున్నారు -
శాశ్వతానందప్రదాయి! జయ సత్యసాయీ! నమోస్తు!



వేదాలు కడలిలో ముంచి విశ్వమున్ వేధించు సోమ
కాది రాక్షసుల పోకార్ప ఆది మత్స్యావతారమ్ము
మోదమ్ముతో దాల్చి వేదముల్ కాచి బ్రోచిన ప్రోడ!
సాదృశ్యమే లేని దేవ! జయ సత్యసాయీ! నమోస్తు!

సాగరమ్ము మథించి విపుల సంపదైశ్వర్యముల్ పొంద
గా - గోరి దేవదానవులు గట్టును కడలిలో దింప
గా - గట్టు దిగిపోవుచుండ కమఠమై కాపాడితీవు
జాగైన లేకుండ - స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

అల హిరణ్యాక్షుండు ధూర్తుడై భూమినంతటిన్ జుట్టి
బలిమి గొంపోవగా వేగ వారాహప్రభుడవై వాని
తలద్రుంచి అసమానమైన దయతోడ ధరగాచితీవు
జలజాతనేత్ర! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

బాలప్రహ్లాదుండు నీదు పాదాలు పట్టి ప్రార్థింప
జాలిమాలిన తండ్రి రాక్షసము జూపి శ్రమబెట్టుచుండ -
గోళులన్ జీల్చి రాక్షసుని - కుఱ్ఱనిన్ కూర్మిబ్రోచితివి
జాలితో - నరసింహమూర్తి! జయ సత్యసాయీ! నమోస్తు!

బలి గర్వముడుపగా అదితి పట్టివై ప్రభవించి వేగ
బలి యజ్ఞమునకేగి మూడు పాదాలు పట్టుమాత్రమ్ము
ఇలగోరి బలిని పాతాళమేల పంపించినా వీవు!
జలజాక్ష! వామనస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

స్వార్థమ్ము వార్థియై వేయి హస్తాల వసుధ ముంచెత్త
అర్థి మాతృాణమ్ము తీర్చ ఆకాంక్షివై ఆగ్రహమున
వ్యర్థమూర్ధన్య శీర్షములు పరశువున్ బట్టి ఖండించి
స్వార్థమ్ము దూల్చిన రామ! జయ సత్యసాయీ! నమోస్తు!

పరహింస గావించి పరుల భార్యలన్ బట్టి బాధించు
సురవైరులన్ జంపి ధర్మచోదితాచ్యుత వర్తనముల
నరుల కాదర్శమూర్తివయి నడచిన నారాయణుడవు
సరసాంతరంగ! శ్రీరామ! జయ సత్యసాయీ! నమోస్తు!

భుజముపై హలమూని కృషిని పోషించు పుణ్యకర్మమున
నిజమైన కర్షకుల ప్రతినిధివైన నీ సచ్చరిత్ర
విజయ సందేశమ్ము రామ! విశ్వజీవితమయ్యె నీది
స్వజన ప్రమోద ప్రదాత! జయ సత్యసాయీ! నమోస్తు! 70



పరమ కారుణ్యమూర్తివయి ప్రాణుల బాధారహస్య
మరయగా సర్వభోగాలు త్యజియించి అడవులన్ జొచ్చి
పరమ ధర్మామృత మ్మొసగి ప్రజల కాపాడిన దేవ!
సరసాత్మ! ఓ బుద్ధదేవ! జయ సత్యసాయీ! నమోస్తు!

క్రూర పాపస్వభావులను కూల్చి దిక్కనులేని దీన
నారాయణుల గావ కంకణమ్మూని న్యాయాశ్వమెక్కి
ధారుణిన్ ధర్మ ఖడ్గమ్ము దాల్చి కర్తవ్యమందించు
చారు కల్క్యవతారమూర్తి! జయ సత్యసాయీ! నమోస్తు!

అవసరంబైనప్పుడపుడు అవతార మానంద మొదవ
భువిదాల్చి సత్యధర్మమ్ము పోషించు పురుషోత్తముడవు
అవివేకముల్ ద్రోచి కాంతులనయమ్ము నందింతువీవు
జవసత్వమీవయ్య ప్రజకు జయ సత్యసాయీ! నమోస్తు!

యజ్ఞస్వరూప! యజ్ఞేశ! యజ్ఞాంగ! యజ్ఞ సంభూత
ప్రజ్ఞాధురీణ! కాలజ్ఞ! సర్వదైవజ్ఞ! సర్వ సమ
యజ్ఞ! అజ్ఞానాంధకార దూరీకృతాంశుమాలీ! ర
సజ్ఞ! మాంపాహి! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

బదరీకి ఎగువలోనున్న పరమమౌ నారాయణ గుహ
ముదముతోడను చేరి నిరతము తపము చేయుచుండుడని
పదకొండుమంది కషయపు పాత్రనొసగి పంపినావు
సదయాంతరంగ ఓదేవ! జయ సత్యసాయీ! నమోస్తు!

విశ్వకల్యాణ కారణ మహావేదవృక్షమ్మ వీవు
శశ్వత్ కళాపూర్ణ నిత్యసౌహిత్య సాహిత్య మీవు
విశ్వ సందేశ ప్రచార భావనావేశమ్ము నీవు
శాశ్వతానంద వాగ్దేవి! జయ సత్యసాయీ! నమోస్తు!

పవనజ సంగీత రాజ్య రస చక్రవర్తివే నీవు
నవనవోదిత గాన కింపురుష వంశనాళమ్ము నీవు
స్తవనీయ గుణమణి ధ్వని చమత్కృత శబ్దార్థమీవు
సవితృ స్వరూప! దేవేశ! జయ సత్యసాయీ! నమోస్తు!

కామజనక! నిన్ను తలచుకొనగానె కలిగె కామమ్ము
స్వామి! నీ రాక జాగైన నీపైన వచ్చు క్రోధమ్ము
నీ మోము కనుగొన్నయంత మోహమ్ము నిలువునా ముంచు
స్వామి! నే బలహీనురాల! జయ సత్యసాయీ! నమోస్తు!



నిను పొందితినటన్న మదము గుండెలో నిండిపోయినది
నిను పట్టి లోదాచుకొనెడి లోభమ్ము నిలిచిపోయినది
నను ముద్దరాలుగా తలచి బ్రోవవే నా ప్రాణనాథ
జన మనోహర! దేవ! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

నీ దయావాహిని మహిత మందాకినిన్ మించు - హృదయ
మాదరమ్ముగ దాకి ఘోర కలుషముల్ హరియించు - కాంతి
సౌదామినిన్ మించు ప్రేమ భావప్రసారమ్ము - సదయ
సాదృశ్యమేలేని దేవ! జయ సత్యసాయీ! నమోస్తు! 80

ఆస్కారమీవె భారత సనాతనాధ్యాత్మికతకు - తి
రస్కార వాతావరణము సర్వత్ర ప్రాకె ప్రభూ! పు
రస్కార యోగ్య సంస్కరణ గావించి రక్షించుమా! య
శస్కరా! భాస్కరా! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

వనములో ఒక మూల పెద్ద ఱాయిగా పడియుంటినయ్యా
వనజాక్ష! నీ పాదధూళి సుంత నాపై రాల్చవయ్యా!
కనికారమున వచ్చి కావరా! వేగ కల్యాణ రామ!
జనలోక నాయకా! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఏకాంతసేవకై స్వామి! అవకాశమీయవే సుంత
నా కింతకూడ తెలియదు - ఆరాధనము చేసికొనుట
రాకా సుధాకరా! మదిని అంధకారము బాపునట్టి
సౌకర్యములు కూర్చు తండ్రి! జయ సత్యసాయీ! నమోస్తు!

ఇహపరానంత సౌభాగ్య భోగమ్ము లీయరా! అంబు
రుహగర్భ! భవదీయ సేవ వరకె కోరుకొనుట కాదు
మహిత కీర్తి ప్రతిష్ఠలను ఇచ్చి జన్మమ్ము లేకుండ
సహజ పద్ధతిపైన చేయి - జయ సత్యసాయీ! నమోస్తు!

దీనసేవా కార్యములను సతతమ్ము తీవ్రేచ్ఛతోడ
మానస వాక్క్రియాపరుడనై జేయు మార్గము జూపి
జ్ఞానమ్ముతోబాటు నాకు సదవకాశమ్ము లందిమ్ము
జ్ఞాన భాస్కరదేవ! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

మనసులో మాటను చెప్పుకొన్నాను మరి అంతె కాని
జననమ్ము సఫలమ్ము చేసికొనునట్టి చందమ్ము నెఱుగ
నను నీవె మంచి మార్గాన తిన్నగా నడిపించుమయ్య
జనహితాకాంక్ష! మా స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

శ్రీ సత్యసాయి మధ్యాక్కరలు



ఎంత సౌందర్య రాసిక్య మీ వసంతేందిరా జ్యోతి
ఎంత మాధుర్య సంభరిత మీ కోకిలేంద్రుని గీతి
ఎంత సౌలభ్య సౌభాగ్య మీ వనీ హేమాద్రి నీతి
శాంత వాసంత స్వరూప! జయ సత్యసాయీ! నమోస్తు!

వేడి గాడ్పులు సాగి నిప్పుకలు రేగి విశ్వభాండమ్ము
మాడి మంగలమగుచుండె - మండించుకొనుచుండె తరణి
విడుచుండెను జీవకోటి ప్రాణాలు - వేసంగి వెట్టి
చాడుపునుండెనో స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

అంబరమ్మున సాగె మత్తగజయూథ మట్లంబుదములు
సంబరమ్ముగ వీచె హర్షపవనాలు చలచల్లగాను
డంబుగా వర్షంబు కురిసె - ముదము నిండారె సర్వత్ర
సాంబశివా! వ్యోమకేశ! జయ సత్యసాయీ! నమోస్తు!

కౌముదీ కాంతిలో జగతి పెద్ద పాల్కడలియై పొంగె
సోమబింబము శేషశయ్య మాదిరి శోభిల్లసాగె
సోమాంతర కళంక మపుడు శయన విష్ణువుగాగ తోచె
స్వామి! మహావిష్ణుదేవ! జయ సత్యసాయీ! నమోస్తు!

నీ పైన శతకమ్ము వ్రాసి నిండైన నెనరుతో స్వామి
నీ పాద నీరేజములకు నేనిత్తు నీరాజనమ్ము
నా పాపమును బాపి నాదు జీవ సంతాపమ్ము దీర్చు
శాపమోక్షణ దక్ష! స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

సదమలానంద ప్రశాంతి మానస స్వచ్ఛ వీచికల
మృదుల శాంతిశ్రీ మరాళి విహరింప నిచ్చతోవచ్చె
అది పట్టి భీరువు ధైర్యమందించి అలరించుమయ్యా
సదయాంతరంగ! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!



## శాంతిశ్రీ రచనలు

జ్యోతిర్మయి

త్యాగమయి

ఉదాహరణత్రయి

సుందర మందారం

నారద భక్తిదర్శనం

తియ్యని పాటల తిరుప్పావై

అర్చన

శ్రీ శివానందలహరి

భాగవత సప్తమ స్కంద వ్యాఖ్య

శ్రీ విష్ణు సహస్ర కమలము

శ్రీ సనత్సుజాతీయము

నిత్య సౌందర్యలహరి

శాంతిబాల

## డా. జంధ్యాల సుమన్‌బాబు రచనలు

ఆంధ్ర సాహిత్యంలో జంటకవులు

కరుణశ్రీ కవితా సౌరభం

హేమంత సతికి సంక్రాంత సురకాంత ఇదె శుభాకాంక్ష
చామంతి పూబంతి పసుపు పూతల్ ప్రసారించె దిశల
శ్రీమంతులైన దంపతులు ఏలిరి ప్రేమ రాజ్యమ్ము
స్వామి నీ లీలయే జగతి! జయ సత్యసాయీ! నమోస్తు!

వనలక్ష్మి వలువలూడ్చిన యటులరాలె పండుటాకులను
తనువులో పస ఎండినటుల సోలె లతా ప్రశాఖలును
దినమున కొక్కొక్క తీరు ప్రకృతి చిత్రించుచుండెదవు
జనన ప్రదాత! మాస్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

లలితాంకుర లతా వసంత తారుణ్య లావణ్యమీవు
విలయతాప కఠోర దుస్సహ గ్రీష్మ వేత్రమ్మవీవు
తళతళ పూర్ణచంద్రికల నవశారదామూర్తివీవు
సలిల రవి న్యాయ మీవు జయ సత్యసాయీ! నమోస్తు!

హైందవ క్రైస్తవ మహమ్మదీయ ధర్మైక్య స్వరూప!
నందగోపాల! సత్సంగ జీవనానంద ప్రదీప!
వందారు భక్త సందోహ నవభావ వర్ణనాలాప!
సౌందర్యలహరి! మాంపాహి! జయ సత్యసాయీ! నమోస్తు!



ధ్యానమందు మనస్సు నిలిపి ఉంచ సాధ్యమ్ముకాలేదు
గానమ్ములోనైన తన్మయత నందగల శక్తి లేదు
మౌనమ్ముగా నుండిపోదు నన్నను మనసూరుకోదు
జ్ఞానప్రదాత! మాంపాహి! జయ సత్యసాయీ! నమోస్తు!

నా మనస్సొక కోతికంటె చపలమైనది రామ! నీదు
నామ సూత్రమ్ముతో కట్టివైవ యత్నమ్ము చేసితిని
ఏమౌను! నీ కృపా వీక్షణమ్మున్ననే కదా ఫలము
స్వామి! దయాక్షీరవార్ధి! జయ సత్యసాయీ! నమోస్తు!

కోరికల్ తీర్చినా తీర్చకున్నను కోపమ్ము లేదు
కోరకూడదు కాని ఇదొకటే కోరుకొనుచుంటి - ఎట్టి
భారమ్ములైనను బాధలేయైన - భక్తి సూత్రమ్ము
జారిపోకుండగా జూడు! జయ సత్యసాయీ! నమోస్తు!

ఇది కవిత్వంబు కాదయ్య! నా వెట్టి ఎడదలో బాధ
ఇది కావ్యమగుటయు నీ కటాక్షమ్ము ఇందీవరాక్ష!
ఇది కల్పనముచేసి నా కొసంగిన ఈశుండవీవు
సదయుండవన నీవె స్వామి! జయ సత్యసాయీ! నమోస్తు!

రాజహంస స్వామి; ఆ పరమహంస పరమానందస్వరూపులు; ఆ ఆనందమే ఆ సరోవర జలం; ఆ ఆనంద చైతన్యంలో నుండి పుట్టే సదమల స్వచ్ఛ భావ వీచికలే తరంగాలు; ఆ తరంగాల డోలికలలో ప్రశాంత మందహాసంతో ఆ పరమ హంస, ఆ రాజహంస విహరిస్తుంటుంది; ప్రవిమల కాంతి పుంజం ప్రసరిస్తూంటుంది. ఆ కాంతి సంక్షుభిత జీవరాసులకు ప్రశాంతిని ప్రసాదించే పరమకరుణ; ఆ సరోవరంలో విహరించి తరించాలని తండోపతండాలుగా జీవహంసలు రివ్వున వస్తుంటాయి; ప్రశాంతినిలయ ప్రాంగణంలో అడుగుబెట్టే ప్రతి జీవి కూడా అటువంటి హంసల సమూహంలో ఒకడే.

'శాంతిశ్రీ' అటువంటి హంసలలో ఒకరు. ఈ హంస కూడా ఆ పరమహంస పాదపద్మాలచెంద భక్తితో శరణాగతి భావంతో వచ్చింది. ఆ పరమహంస దయాంతరంగ. 'శాంతిశ్రీ' భీరువు. అందువలన దయతో దరిజేర్చుకొని కాపాడుమని ప్రార్థించింది. అది ఆ హంసకు ఆత్మగీతి; నిజానికది విశ్వగీతి. కవివాక్కు విశ్వవాక్కు. అందువలన ఈ పద్యం విశ్వ జీవగీతి.

అసలు పేర్లకంటె కలంపేర్లతో ప్రసిద్ధికెక్కిన కవులు ఒక యాభై ఏళ్ళక్రితం చాలామంది సాహిత్యరంగంమీదకు వచ్చారు. అందరిలో 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు చుక్కల్లో చంద్రునిలాగా ప్రకాశిస్తూ ఉన్నారు. జంధ్యాలవారికి కవితలే జందాలు. అటువంటి కవి వంశంలో



మరొక జంధ్యాల కవి - వేంకటేశ్వరశాస్త్రిగారు ప్రసిద్ధులయ్యారు. వీరి కలంపేరు 'శాంతిశ్రీ'. వీరిద్దరూ వారి వారి కలంపేర్లకు తగ్గట్టుగా కవిత్వం వ్రాయగలవారు. 'కరుణశ్రీ' కవిత 'ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు'లాగా ఉంటూనే పోతనగారి భక్తిభావాన్ని ప్రదర్శిస్తుంది. కరుణారసంలాగా కరుణశ్రీ పద్యం కమ్మగా నాదమధురంగా లాస్యంచేస్తూ జాలువారుతుంది. 'శాంతిశ్రీ' పద్యం 'కరుణశ్రీ' పద్యంలాగా లాస్యం చేయదు; కానీ, మందమందంగా సుందరంగా నడుస్తుంది. కరుణశ్రీ పద్యం మంచి చమత్కారి. శాంతిశ్రీ పద్యం సుకుమారి. ఉద్వేగం లేని గతిశీలం, వక్రతలేని ప్రసాదం, అనుప్రాసలకోసం అంత్యప్రాసలకోసం అంగలార్చని అణకువతనం, అడుగడుగునా సవ్వడిలేని సౌకుమార్యం శాంతిశ్రీ పద్య శాంతస్వభావాన్ని వ్యక్తీకరిస్తూ ఉంటాయి.

'శాంతిశ్రీ' శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు కవితా స్వభావంచేత తమ కలం పేరును సార్థకం చేసుకొన్నారు. పేరుకుతగ్గ తీరు వారి మనః ప్రవృత్తికికూడా అమరింది. నిండుకుండలా తొణకని వారి ధీరప్రవృత్తి శాంతగంభీర భావాలకు ఆలవాలమై ఉంటుంది. వేషంలో, వర్తనంలో, భాషణంలో, సంభాషణంలో కవిగా ఎదుటివారికి అనుభవాన్నందించే సహజకవి 'శాంతిశ్రీ'.

కవితలో 'శాంతిశ్రీ' కావటం అదృష్టం; కాని, ఆ శాంతిశ్రీని ఆధ్యాత్మిక అనుభవంగా, జీవిత పరమార్థంగా